అనాథపతివైన స్వామీ సింహాగిరి నరహరీ నమోనమో దయానిధి."

(సింహగిరి నరహరి వచనములు) * కృష్ణమాచార్య సంకీర్తనములు

* సీ. కటకేంద్రుఁడుఁ దురి కౌగిటిలోఁ జిక్కెఁ
దెళ్లపెళ్లస్వామి చేతఁ గాదు
కృష్ణమాచార్య సంకీర్తనంబులఁ జొక్కె
సింహాద్రి యప్పయి చేతఁ గాదు
కవ్వంపుఁగొండ సంఘర్షణోద్ధతిఁ జిక్కె
శ్రీ కూర్మనాథుని చేతఁ గాదు
శాక్యకొండని కాలబడి కెంపియును బ్రుంకెఁ.
జెన్న మల్లేశుని చేతఁ గాదు
పవన జవనని రాఘాటయవనఘోట
హారణజయధాటి మీచేత నౌను మేటి
వాదు వాకసన్నఁ జూడుమేలా సరాని
శత్రుసంహార ! వేంకటాచలవిహార !

సీ॥ తాళ్లపాక చిసన్న దండెమీటులు గావు
గోమాంసభుగ్దనుర్గుణరవంబు
బంగారుసంగిసబంకమంటి పువ్వులు గావు
యవనాథముల చిలుకంపగములు
సాముడిగ్గియసీటి చల్లులాటలు గావు
పాశ్చాత్యభటుల ఫిరంగిగుండ్లు
సంపెంగబాసలు జరగించుటలు గావు
రిపులపాశములు దర్శించుపగలు

ఇంకను నిట్టిచి శంకరవచనము లని, శఠకోప విన్నపములని, కాలజ్ఞానవచనము లని, కార్తికావచనము లని, భవానీమనోహరవచనము లని, శివరాజయోగి వచనము లని, లక్ష్మీవల్లభవచనము లని, శేషగిరినాథ వచనము లని మఱియుఁ గొన్ని పేళ్లతో వచనరచనలు ప్రాచీనములు గానవచ్చుచున్నవి. అవి యెల్ల నంచు మించుగాఁ బదునాలుగవశతాబ్దికిఁ దరువాతివే కాఁదగు ననుకొందును. ఇప్పటికి నా యెఱుక కందినంతలోఁ గాల

---

బంటుపంతము తగ దంచుఁ బంటకాఁపుఁ
దనము గైకొంటి విది మంచిగుణమె దినము
జనము దెచ్చిన ధనములప్పనము లిచ్చి
శత్రుసంహార ! వేంకటాచలవిహార !

సీ॥ పొట్టేళ్లఁగట్టి బట్టి బోడిసన్న్యాసులం
  ఫీయని తాఁకు లాడించునొకఁడు
సోమయాజుల బ్రహ్మసూత్రముల్ ద్రెంచి సిం
  గాణివింట్లకు వల్లె గట్టు నొకఁడు
ఖూబుఘోడా యంచు గుడిసెలు గుఱ్ఱము
  నెక్కి ఛేయని తరటెత్తు నొకఁడు
పైకాలు గొమ్మని బల్మిఁ గోమటివారి
  చెలువపైఁ బడి బూతు సేయు నొకఁడు
యవనసమ్మర్ద దుర్దినం బైన దిగువ
దిరుపతిని జూచి మిటువంటిచోటిని నిదుర
వోవుచున్నాఁడు మీయన్న లేవలేక
శత్రుసంహార ! వేంకటాచలవిహార !

నిర్ణయముఁ జెప్పఁదగిన ప్రాచీనవచనరచనలలోఁ గృష్ణమాచార్యుల సంకీర్తనముల తర్వాత 'వేంకటేశ్వరవచనములే' పేర్కొనఁదగినవి. ఈ రెంటిలోఁ దొలిది పదుమూఁడవశతాబ్ది లోనిది. రెండవది పదునైదవ శతాబ్ది తుదిది. ఇక్కడఁ బ్రశస్తములు శ్రీ వేంకటేశ్వరవచనములు.

## తాళగంధి చూర్ణకములు

ఇవి తిరుపతిక్షేత్రమున శ్రీ వేంకటేశ్వరస్వామి వారి దివ్యస్థానమున సంకీర్తనాచార్యులుగ సుప్రఖ్యాతు లయిన తాళ్ళపాకవారు రచించినవాటిలోనివి. ఏతత్కర్త తాళ్ళపాక పెదతిరుమలాచార్యుఁడు పదునైదవ శతాబ్ది చతుర్థపాదమున జనించి పదునారవశతాబ్ది పూర్వార్థమున వర్తిల్లినవాఁడు. * ఈ పెదతిరుమలాచార్యులవారికిఁ

---

* అతని కాలముననే యీ వచనములు రాగిరేకులమీఁదఁ జెక్కింపఁబడి తిరుపతి దేవస్థానమున భద్రపఱుపఁబడినవి. ఈ వచనములే కాక తాళ్లపాకవారి పద్యగద్యగేయ రచనము లనేకములు రాగిరేకులపైఁ జెక్కఁబడి భద్రపఱుపఁబడినవి. అందుఁ గొన్నిరేకులు అహోబలమునకు శ్రీరంగమునకును గూడఁ జేర్పఁబడినవఁట! ఇటీవల నహోబలములోని రాగిరేకులు కొన్ని రాగిపాత్రలకై యమ్మఁబడినవనియు, నట్లమ్మఁబడినవి నాలుగైదు వందల రూపాయల విలువఁగల రాగిరేకు లనియు, వింటిని. తిరుపతి రేకులమీఁది సంకీర్తనములు శ్రీ తిరుపతి దేవస్థానమువా రిప్పటికిఁ గొన్నింటి ముద్రించిరి.

కుమారుం డయిన చినతిరుమలాచార్యుఁడు తనతండ్రి పెదతిరుమలాచార్యులు వ్యాఖ్యానించినతీరు ననుసరించి తనతాత తాళ్ళపాక యన్నమాచార్యుఁడు సంస్కృత మున రచించిన 'సంకీర్తనలక్షణమును' తెలుఁగునకుఁ బరివర్తనము చేసెను. అందీవచనరచనల నిర్వచన మిట్లున్నది.

'మఱియుఁ జూర్ణాఖ్యపదం బెట్టి దంటేని—

ఆ॥ ధరఁ గృష్ణాచార్యాదిక
పరికల్పితపదము తాళబంధచ్ఛందో
విరహితమై చూర్ణాఖ్యం
బరఁగు నది నిరుక్త నామభాసి మగుచున్.

మఱియుఁ బచ్చూర్ణవిధం బెట్టిదనిన—

క॥ ఛందోగణముల నియమం
బొందక తాళప్రమాణమునఁ గడుఁ జెలువై
కొందలిచేఁ బచ్చూర్ణం
బందముగాఁ దాళగంధి యనఁ బొగడొందున్.'

పూర్వోదాహృత మైనసంకీర్తనలక్షణ గ్రంథ నిర్వచనముచొప్పునఁ దాళగంధిచూర్ణము లనఁ దగిన యీ వచనములను రచించి శ్రీ స్వామివారి సన్నిధిని శ్రీ తాళ్లపాక పెదతిరుమలాచార్యుఁడు రాగతాళములతో నాలాపించువాఁడు కాఁబోలును! రాగిరేకులనుండి యెత్తి శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువా రింతకు ముందు ముద్రింపించినవచనములు నలువదేడింటికి రాగ తాళ

ములు నిర్ణీతము లయి యున్నవి. మఱియు నందీవచన ములు 'వైరాగ్యవచనమాలికాగీతము' లను పేరఁ జేర్కొనఁబడినవి. అనఁగా నివి వచనములే యయినను గీతములుగాఁ బాడఁదగిన వన్నమాట! అందుచేతనే యివి సంకీర్తనలక్షణమున 'తాళగంధిచూర్ణకపదము' లని పేర్కొనఁబడినవి. సంస్కృతమున వామనుఁడు వృత్తగంధి, ఉత్కలికాప్రాయము, చూర్ణము నని ముత్తెఱఁగు గలవచనరచన చెప్పఁగా నితఁడా చూర్ణమను వచనవిభాగముననే తాళగంధి యని పదరచనా విభాగముగాఁ గల్పించినాఁడు. ఈ తెలుఁగు వచనరచన లకుఁ జూర్ణమను పేరు పొడిపలుకులం దుండుటచే నేర్పడిన దగుట నీతఁడు సూచించినాఁడు. మనయీ వేంకటేశ్వరవచనములు పొడిపొడిపలుకులకూర్పు కాని, యిందుదఁదీర్ఘోక్తులు, ప్రౌఢసమాసములు లేవు. ఇట్టిపద రచనములకుఁ గృష్ణాచార్యాదులు పరికల్పకు లని యీ సంకీర్తనలక్షణపద్యమున నున్నది. ఇంతకుముందు నే నుదాహరించినకృష్ణమాచార్యసంకీర్తనములకర్త కృష్ణా చార్యుఁడే సంకీర్తనలక్షణకారుఁడు పేర్కొన్న కృష్ణా చార్యుఁడు గాఁగలఁడు. ఇట్టిరచనములకుఁ గృష్ణమా చార్య సంకీర్తనము లనఁబడుసింహగిరినరహరి వచన ములే ప్రప్రథమరచనము లని యీ సంకీర్తనలక్షణ గ్రంథోక్తినిబట్టి గుర్తింపనగును. దీనిని లక్ష్యీకరించు కొనయే యనంతామాత్యుఁడు గద్యనిర్వచనము నట్లు

చేసియుండును. తర్వాతి కాలమున నిట్టివచనములు 'విన్నపము' లనియుఁ జేర్కొనఁబడినవి.

## వేంకటేశ్వర వచనములు - వానియోగ్యత

ఈ వచనములకు రచనమునం దానుపూర్వి యేదియుఁ గానరాదు. వస్తువిన్యాసమునఁ గూడఁ గ్రమపద్ధతి యేదియుఁ దోఁపదు. కవి యప్పటప్పుడు తనకుఁ దోఁచిన తత్త్వవిషయముల నీశ్వరస్తోత్రపరములు గావించి విడివిడిగనే వచనములుగా రచించినాఁడు గాఁబోలును! ఇందు విశిష్టాద్వైత సిద్ధాంతవిషయములు సర్వత్ర కరడు గట్టియున్నవి. గ్రంథకర్త స్మార్తనందవరీక బ్రాహ్మణుఁడైనను వైష్ణవమతము స్వీకరించినవాఁడు. జాలిజాలిగాఁ గొసరి కొసరి శ్రీ వేంకటేశ్వరస్వామిని గవి యేతద్వచనరచనలలోఁ బలుదెఱఁగులఁ బరమార్థలబ్ధికై ప్రార్థించును. విశిష్టాద్వైతసిద్ధాంతపు జీవగఱ్ఱయగు 'శరణాగతి' యిందుఁ జాలఁ జక్కఁగా సమాదరింపఁబడినది. కవి యిందు స్వామిని బలుచోట్ల నేకవచనముననే తేలికగా 'నీ' వని యెచ్చరించును. తోడ్తోఁ గొన్నిపట్టుల 'మీ' రని గొప్పగా బహూకరించును. తండ్రియొడిలోఁ గారవేడ్కలతో నుండు ముద్దులబిడ్డఁడు తండ్రిని నెయ్యంపుముగుదనపుఁ దొక్కుఁబలుకులతో నీవని తూఁకరించుట, యంతలోనే పెద్దఱికపుహద్దు తోఁపగా మరల మీ రని బహూకరించుట యందం దనుభూయమానమే

కదా! ఆ యనుభూతి నాకీ తీరుపునకు సమర్థకముగాఁ దోఁచినది.

ఇందు ౧౮౭ వ వచనమున నూటయెనిమిది తిరుపతుల పేళ్లు పేర్కొనఁబడినవి. నిత్యానుసంధానాదులగు నర్వాచీనద్రావిడవైష్ణవ సంప్రదాయగ్రంథములలో నూటయెనిమిది తిరుపతుల (దివ్యస్థలముల) పేళ్లు ముద్రితములయి యున్నవి. వాని పరిగణన మాత్రమునగా నేనాఁడు జరిగెనో గుర్తింపఁజాల నయితిని. ఆ పేళ్లకు నిందున్న పేళ్లకుఁ జాల భేదమున్నది. క్రీ ౧౫౦౦ ప్రాంతముల నూటయెనిమిది తిరుపతుల పేళ్ళు పెక్కువిధముగా నుండెనని దీనిఁబట్టి తెలియనగును. ఇందుఁ గొన్ని స్థలములపేళ్ళు తప్పులుగా నున్నట్టున్నవి. ప్రబంధరాజ వేంకటేశ్వరవిలాసమునను, హా. నవింశతిగోను నూట యెన్మిది తిరుపతుల పేళ్లు నిందున్నతీరు ననుసరించి యున్నవి.

ఇందు వచనరచనారీతిలో ననంతుఁడు చెప్పిన గద్య (వచన) లక్షణము చక్కఁగా సరిపడినది. లక్షణశిరోమణికారుని 'విన్నపము' రచన కీవచనములు మంచి లక్ష్యము లనఁదగును. దూరాన్వయము, సమాసక్లేశము, ననుప్రాసవిన్యాసపరిశ్రమము నిందు లేవు. సూటిగా మనసున నాటునట్లు భావము లున్నవి. కొన్ని వచనములు టాగోరుగారి గీతాంజలిరచనములఁ దలఁపించునవిగాఁ గూడ నున్నవి. కృష్ణమాచార్యసంకీర్త

నములు సరిగా నిట్టివే, వీనికి మూలకల్పములే కాని, యందు భాషాప్రాచీనత యింతకంటె విస్పష్టముగా గోచరించుచున్నది. ఈ వచనములను రాగతాళములతోఁ బ్రాచీనకాలమునఁ బెక్కురు పాడెడివారు గావలయు. కవియే భావానుగుణముగా వీనికి రాగతాళములఁ గల్పించినాఁడు.

## తాళ్లపాకవారు

ఏతద్గ్రంథకర్త తాళ్ళపాక పెదతిరుమలాచార్యుఁడు నందవరీక స్మార్తబ్రాహ్మణుఁ డంటిని. తాళ్ళపాక నేఁటి రాజంపేట తాలూకాలోనున్నది. అది వీరి నివాసగ్రామము. ఈకవి తండ్రి

## అన్నమాచార్యుఁడు

ఈతఁడు వైష్ణవమతమును స్వీకరించినవాఁడు. గొప్పభక్తుఁడు. కవి. మహిమలు గలవాఁడు. ఈతఁడు నెబ్బదితొమ్మిదియేండ్లు జీవించెను. ఈ యన్నమాచార్యుఁడు దినమున కొక్కదానికేని తక్కువకాని చొప్పున గేయములు రచించుచు శ్రీ వేంకటేశ్వరస్వామి సన్నిధిని సంకీర్తనము చేయుచుండువాఁడట! ఈతనికిఁ బదునాఱవయేట స్వామి ప్రత్యక్షమయ్యెనట! నాఁటనుండియే స్వామి యానతిచొప్పున నితఁడు సంకీర్తనములు రచింప నారంభించెను.

ఈతనికి సంకీర్తనాచార్యుఁ డని, ద్రవిడాగమ సార్వభౌముఁ డని, పంచమాగమచక్రవర్తి యని బిరు

ములు. శ్రీ వేంకటేశ్వరస్వామి కీతఁడు వరాము. అలమేలుమంగాంబ కీతఁడు తండ్రి వరుసవాఁడు. ఇతని సంకీర్తనలను వినుచెవిని మఱియొకరి సంకీర్తనముల విన నొల్లనని శ్రీవేంకటేశ్వరస్వామి ప్రతిజ్ఞఁ గావించె నఁట! ఈతఁడు రచించిన గ్రంథములు ౧ ఆధ్యాత్మసంకీర్తనలు ౨ శృంగారసంకీర్తనలు ౩ శృంగారమంజరి ౪ సంకీర్తనలక్షణము (సంస్కృతము; ఇది దొరకలేదు) ఈ కవికి సంబంధించినచరిత్రము శాసనాదులందుఁ గానరాదు. [1]కాని తాళ్ళపాక చిన్నన్న ద్విపదకృతిగా నితని చరిత్రము రచించినాఁడు. ఈతని కుమారుఁడు

## [2]పెదతిరుమలాచార్యుఁడు

ఈతఁడే శ్రీవేంకటేశ్వరవచనములకుఁ గర్త. శ్రీ తిరుపతి దేవస్థానమున నున్న రాగిరేకులమీఁద నీ వచనములు తిరుమలాచార్యరచితము లని గ్రంథారంభమునఁ జెప్పఁబడినది. ఈతఁడు మహైశ్వర్యసంపన్నుఁడుగా వెలసెను. శ్రీ వేంకటేశ్వరస్వామి కితఁ డనేక కైంకర్యములు జరపించెను. శ్రీ స్వామి యీతనితోఁ దరుచాతి

1. ఇది తిరుపతి ఓరియంటల్ యిన్స్టిట్యూట్‌వారు ప్రకటించిరి.

2. ఈతఁడు పెరియ తిరుమలాచార్యుఁ డని, పెద తిరుమలాచార్యుఁ డని, పెద తిరుమలయ్య యని, తిరుమలార్య దేశికుఁ డని పలుదెఱఁగుల పేర్కొనఁబడుచున్నాఁడు.



పెదతిరుమలయ్య

మూఁడుతరములదాఁకఁ బ్రత్యక్షమును, నేడుతరముల దాఁకఁ బరమపదమును ననుగ్రహించెనఁట! ఈతని యితర కృతులు ౧ శృంగార సంకీర్తనలు ౨ శృంగారదండకము ౩ చక్రవాళమంజరి ౪ శృంగారవృత్తశతకము ౫ శ్రీవేంకటేశోదాహరణము ౬ నీతిసీసశతకము ౭ సుదర్శనరగడ ౮ రేఫఱకారనిర్ణయము ౯ ఆంధ్రవేదాంతము (ద్విపద) ౧౦ ఆంధ్రహరివంశము ౧౧ భగవద్గీత (వచనము) ౧౨ శ్రీవేంకటేశ్వర ప్రభాత స్తవము ౧౩ అధ్యాత్మసంకీర్తనలు. ఈతనికి వేదమార్గప్రతిష్ఠాపనాచార్య, శ్రీరామానుజ సిద్ధాంతస్థాపనాచార్య, వేదాంతాచార్య, కవితార్కికకేసరి, శరణాగతవజ్రపంజర బిరుదములు కలవు. స్వామికీతఁడు జరపిన కైంకర్యముల సారము :—

పెదతిరుమలయ్యగారు క్రీ. 1517 నుండి 1552 దాఁక శ్రీ వేంకటేశ్వరస్వామివారికిని, నింక నితరస్థలములలోని దేవాలకును నైవేద్యప్రసాదోత్సవాది కైంకర్యములకై పదునాల్గు గ్రామముల నర్పించిరి. ఆ గ్రామములు అచ్యుతరాయఁడు, బుక్కయ తిమ్మరాజు మొదలగువారు తనకు దానము చేసినవి. అంతేకాక యెన్నో వేల పణములను గూడ నానాపుణ్యకార్యములకై వా

రర్పించిరి. తిరుమలమీఁదఁ దమసంకీర్తనములు చెక్కించినరాగిరేకులు దాఁచియుంచిన సంకీర్తనభాండారము రక్షించుటకై యర్చించుటకై కూడ గొప్పదానములు చేసిరి. తండ్రిగారును దామును రచించిన సంకీర్తనములను స్వామివారిసన్నిధిని బ్రతిదినముఁ బాడుటకై యిద్దఱు వైష్ణవుల నియోగించిరి. స్వామివారి కోనేటిని, గోపురములను, మంటపములను చెక్కఁటిని జక్కఁబఱపించిరి. కోనేటిపడమట నీరాడుమంటపమును గట్టించిరి. ఇట్లెన్నో పుణ్యకార్యముల జరపిరి. తండ్రివలె నీతఁడు గూడఁ బూర్ణపురుషాయుషజీవితము గల్గినధన్యచరిత్రుఁ డయి యుండును. ఈతని జన్మకాలము క్రీ 1473 అగును. అప్పటినుండి క్రీ. 1553 తర్వాతిదాఁక నీతఁడు జీవించినాఁడు. ఈతనికి సాతానివైష్ణవు లిద్దరు శిష్యులుండెడివారఁట! వారుకూడ నీతనివలె స్వామికిఁ గొన్నికైంకర్యములు జరపిరి.

ఈతనికిఁ గుమాళ్లు ౧ చినతిరుమలార్యుఁడు ౨ అన్నయ ౩ పెదతిరువేంగళనాథుఁడు ౪ తిరువేంగళనాథుఁడు (చిన్నన్న) ౫ కోనేటి తిరువేంగళనాథుఁడు.

ఇందు నాల్గవకుమారుఁ డయిన తిరువేంగళనాథుఁడు రచించిన యష్టమహిషీకల్యాణమున వీరి వంశవృక్ష మిట్లున్నది.

1 అన్నమాచార్యుడు (౧౪౨౪-౧౫౦౩)
(తిమ్మాంబ | అక్కాంబ)

- (తిమ్మాంబవలన) నరసింహ (నాచ్చారమ్మ | అనంతమ్మ)
  - నారాయణ (నాచ్చారమ్మవలన)
    - 3 చినతిరుమలాచార్యుడు
      - 5 తిరువేంగళప్ప
  - అప్పలార్య (అనంతమ్మవలన)
    - అన్నయ
  - అన్నయార్య (అనంతమ్మవలన)
- అక్కాంబవలన 2 పెదతిరుమలాచార్యుడు (తిరుమలమ్మ) 1473-1553. ఇంచుమించుగా
  - పెదతిరువేంగళనాథుడు
  - 4 చిన్నయ్య అను తిరువేంగళనాథుడు
- తిరుమలాంబ (తిరుమలకొండయాచార్యుడు)
  - నరసమాంబ | (?) 6 రేవణూరి వేంకటార్యుడు
    - కోనేటి తిరువేంగళనాథుడు

1. మూలపురుషుఁడు శృంగార సంకీర్తనాది గ్రంథకర్త.

2. వేంకటేశ్వరోదాహరణాది బహుగ్రంథకర్త. వేంకటేశ్వరవచనకర్త కూడ.

3. సంకీర్తనలక్షణాది గ్రంథకర్త.

4 అష్టమహిషీకల్యాణ పరమయోగివిలాసోషాపరిణయ యామునాచార్య చరిత్ర గ్రంథకర్త.

5. ఆంధ్రధాతు రుద్రామర వ్యాఖ్యా కావ్యప్రకాశ వ్యాఖ్యాకర్త.

6. శకుంతలాపరిణయము, శ్రీపాదరేణుమాహాత్మ్యము ఇతని కృతులు.

ఈ తాళ్ళపాకవారికి దేవఁగూరివారు జామాతృ వంశమువారు. దేవఁగూరి వేంకటకవి తన శకుంతలాపరిణయమున నిట్లు చెప్పినాఁడు.

శ్రీవత్సాన్వయ దేవఁగూరికులజున్ శ్రీపాదరేణుప్రభా
సౌవర్ణస్ఫుట కావ్యకల్పనకళా సంకీర్తనాచార్యపు
త్రీసంశోత్తము నంద వైదికబుధాతిప్రోక్తసత్కీర్తియుం
భావుం దిర్మల కొండయార్యసుతు శుభద్వేంకటా
భిఖ్యునిన్.

శ్రీ వేంకటరమణునకు......... సమర్పణంబుగా సమర్పించెద నిహపరసాధనములకు నింక నేమి కొదవ యదియునుం గాక యమ్మహాదేవుఁడు మదీయమాతా

మహావంశశిఖారత్నం బగు నన్నయాచార్యునకు జామాత రుం డనిపించుకొని భవదీయసంకీర్తనంబు లాలించిన కర్ణంబుల నితరసంకీర్తనంబు లాలించ నని ప్రతిజ్ఞ గావించెఁ దత్సూనుం డగు పెద్దతిరుమలాచార్యభిక్షు నకుఁ ద్రిపురుషపర్యంతముగాఁ బ్రత్యక్షంబును, సప్త పురుషపర్యంతముగా మోక్షంబు గొసఁగెద నని వర మిచ్చె; సచ్చరిత్రు లగు తదీయపౌత్రులకుఁ జినతిరుమల దీక్షితాన్నయాచార్య తిరువేంగళనాథకోనేటితిరువేంగళ నాథ వెంగళార్యులకు విచిత్రముక్తాతపత్ర రత్నకిరీట ముద్రికా ప్రచండమణిమండిత మకరకుండలోత్కు— రాహః కరదీపికా పాదుకాది బహూకరణంబులఁ గరు ణించె; విశేషించియు సత్తిరువేంగళనాథుండు సంకీర్త నంబుఁ బాడిన నాఁడు దొడంగి నేతత్ప్రకారంబున నమ్మహానుభావునకుఁ బాండవసహాయుండైన శ్రీకృష్ణ దేవునింబలె సహాయుండై......ధన్యుడ నయ్యెద నని నిశ్చయించి" ఈ గ్రంథమునుబట్టి చూడఁగా నీ వేంక టాచార్యకవి సంకీర్తనాచార్యుఁ డగు నన్నమాచా ర్యునికి దౌహిత్రసంతతములోనివాఁ డని యేర్పడును. రచనము జాలఁ దర్వాతిదిగానే యున్నది. ఈత నిదే యగు *శ్రీపాదరేణుమాహాత్మ్యమాగద్య మాతఁడు సంకీర్తనాచార్యుని మనుమఁడే యనఁదగిన ట్లున్నది:—

* ఇది తిరుపతి ప్రాచ్యపరిశోధనశాల లైబ్రరీలో నున్నది. కృత్యవతరణిక లేదు.

'ఇది సంకీర్తనాచార్యదౌహిత్ర రేవణూరితిరుమలకొండ యాచార్యపుత్ర వేంకటాచార్యప్రణీతం బైన శ్రీపాద రేణుప్రభావం బనునిస్సహాయకావ్యంబునందు రంభా పురందరసంవాదం బనునది తృతీయోల్లాసము.' ఇది తప్పయి యుండునేమో! 'సంకీర్తనాచార్యదౌహిత్ర వంశ్య' అని యుండఁదగు నేమో!

ఆనాఁటి తాళ్ళపాకవారివారు మహనీయులు. వారి రచనము లింక నెన్నో ప్రకటితములు గావలసి యున్నవి.



# హరవిలాసము

## కృతికర్త

శ్రీనాథకవి జన్మదేశము కృష్ణామండలమందలి కాల్పట్టణము; ఒండెఁ, గలుపటము కాఁదగును. * పాకనాటి నియోగి గాన యాతఁడు పుట్టి పెరిఁగినయూరు పాకనాటనే యుండవలె ననుట సరిగాదు. పాకనాటినియోగులు తొలుత పాకనాట నుప్పతిల్లినవా రగుదురు. అంతే కాని, సదా వారక్కడే పుట్టుచుఁ బెరుఁగుచు నుండవలసినవా రనఁగాదు. శ్రీనాథుని బంధువులు (కాన, పాకనాటి నియోగులు) బెండపూఁడి యన్నామాత్యాదులు శ్రీనాథునినాఁటనే గోదావరీమండలమున నుండిరి. వారు కొన్నితరముల పూర్వమునుండి గోదావరీమండలవాస్తవ్యులే. పాకనాటివారు పాకనాటనే, వెలనాటివారు వెలనాటనే, యాఱువేలనాటివారు ఆఱువేలనాటనే యానాఁ డుండి రనుట కాధారములు గాన రావు.

శ్రీనాథుఁడు క్రీ. శ. 1385 ప్రాంతముల జన్మించి చిరంజీవియై పదునైదవశతాబ్ది యుత్తరార్ధమునఁ గొంత దాఁకఁ గూడ వెలయుచుండెను. ♦

* చూ. శృంగార శ్రీనాథము

# హరవిలాసము

సీ. కమలనాభునిపౌత్త్రుఁ గవితామహారాజ్య
భద్రాసనాసీనుఁ బరమపుణ్యుఁ
బ్రాపు నాపస్తంబసూత్త్రు భారద్వాజ
గోత్త్రు సజ్జనమిత్త్రుఁ గులపవిత్త్రు
భీమాంబికామారనామాత్యనందను
నఖిలపురాణవిద్యాప్రవీణు
నధ్వర్యు వేదశాఖాధీతినిష్ణాతు
సంస్కృతభాషానైషధాబ్జభవుని
నుభయభాషాకవిత్వ ప్రయోగకుశలు
వాలసఖు గారవించి తాత్పర్య మొప్ప
నవచిత్త్రిపురాంతకుం డబరాధిరాజు
హితమితోక్తులు వెలయంగ నిట్టు లనియె.

పై పద్యమున శృంగారనైషధరచనప్రశంస గలదు. కాన హరవిలాసరచనము శృంగారనైషధ రచనానంతరము జరగిన దగుట స్పష్టపడినది. శృంగారనైషధము పెదకోమటి వేమారెడ్డిగారు కొండవీటి సామ్రాజ్యము నేలుచుండు కాలమునఁ దన్మంత్రి యగు మామిడిసింగామాత్యున కంకితముగా రచియింపఁబడి నది. అందు మామిడిసింగమంత్రి యిట్లు ప్రస్తుతుడయ్యెను.

మ. అపుదారన్ వివిధాగ్రహారములతో
సాందోళికాచ్ఛత్రచా
మరక (ప ?) ల్యాణకటాచికాదులుహూన
మ్మానార్ఘ్య చిహ్నంబు లా
దర మొప్పారఁగ వేమభూపతిసచే
తన్ గాంచె సామ్రాజ్యసం
భరణప్రౌఢుఁ డమాత్యసింగఁడు నయ
ప్రాగల్భ్యగర్వోన్నతిన్.

క. శ్రీమహిత పెద్దకోమటి
వేమక్షితిపాల రాజ్యవిభవకరార
క్షమదికి సింగసచివ
గ్రామణికిన్ బాంధ్యరాయగజకేసరికిన్.

మ. ................వేమభూపతి మహా
సామ్రాజ్యరక్షామణీ
యవనాధీశ సభాసింహాసనవచో
వ్యాపార పారంగతా!

శ్రీనాథకవియుఁ బెదకోమటివేమారెడ్డిగారి రాజ్యకాలమునఁ దదాస్థానవిద్యాధికారిగా నుండెను. పెదకోమటివేమారెడ్డిగారు క్రీ. శ. 1404 నుండి 1420 దాఁక రాజ్యమేలిరి. శృంగార నైషధరచన మాకాలమున, అటు తర్వాతనేని జరిగినది కావలెను. హరవిలాసరచన మంతకు నింకను దర్వాతి దగునుగదా !

భీమఖండమును శ్రీనాథుఁడు క్రీ. శ. 1428 కిఁ దరువాత రచించెను. * భీమఖండము సంస్కృతగ్రంథ

---

* చూ. శృంగార శ్రీనాథము.

మునకుఁ దెలిఁగింపు. అందలి పద్యము లెల్ల సంస్కృత మూలానుసారులు. భీమఖండమునను హరవిలాసమునను సముద్రమథనకథ గలదు. మూలానుసారి యగుభీమఖండపద్య మీ క్రిందిది హరవిలాసమునను గలదు.

క. కటుకు మగువిషము విషధర
కటకం బగుకేలఁ బూని కౌతూహలియై
ఘుటికా సంసిద్ధుఁడు విష
ఘుటికయునుంబోలె మృడుఁడు గుటుకున మ్రింగెన్.

దీనికి సంస్కృత భీమఖండమున మూల మిట్లు కలదు.

శ్లో. గ్రసతే స్మ జగత్త్రాతా
విషభృద్భూషణో విషమ్
ఘుటికాం ఘుటికాసిద్ధో
బధ్వా రసమయీ మివ—౧ అధ్యా. ౭

కాన, భీమఖండరచనానంతరము హరవిలాసరచనము జరగె ననవలె.—అనఁగా, క్రీ. శ. 1430 తర్వాత హరవిలాసరచనము జరిగిన దేర్పడును.

## కృతిపతి

హరవిలాసము శ్రీనాథుని బాలసఖుఁ డగు నవచితిప్పయ యను వైశ్యవర్యుని కంకితము సేయఁబడినది. బాలసఖపదమునకుఁ జిన్ననాఁటి స్నేహితుఁ డని యర్థము. (ఈ యర్థముననే భారతాదిగ్రంథములయందుఁ బ్రయుక్తము.) హరవిలాసరచననాఁటికి నవచితిప్పయ కడు వృద్ధుఁడు.

క. కంటిఁ బ్రవిశుద్ధసంతతి
వింటిఁ బురాణములు పెక్కు విశ్వము పొగడన్
మంటి బహువత్సరంబులు
గొంటి యశోధనము సుకవికోటులచేతన్.

హరవిలాసము అవతరణిక.

అతనిబాలసఖుఁ డగు శ్రీనాథుఁడును హరవిలాస రచననునాఁటికి వృద్ధుఁడే. కాని, శ్రీనాథునికంటెను నవచితిప్పయ మఱీ వృద్ధుఁడు. అవచితిప్పయ కాంచీ పురనివాసి. శ్రీనాథుఁడు కాంచీపురి కరిగి యక్కడ నీ గ్రంథమును భీమఖండరచనానంతరము కాశీఖండరచన మునకుఁ బూర్వము రచించి యుండును. హరవిలాస కృత్యవతరణికాపద్యములు, కాశీఖండమున 'కంచి యజు నత లసమాస్తుత్రిఖగ్గలతిలు' అన్న పద్యమును నాతని కాంచీపురీపరిచయము నెఱిఁగించుచున్నవి

రెడ్డిరాజ్యారంభకాలమునాఁటనుండియును నవచి తిప్పయవంశమువారు ద్వీపాంతరములతో వ్యాపారము జరపుచు, రెడ్డిరాజుల కత్యాప్తు లయి యుండిరి. అద్దం కికిని గొండవీటికిని జేరువగాఁ దూర్పుసముద్రమునొద్దనుఁ గల ముకుళపురము (మోటుపల్లి) ఓడరేవుద్వారమున ద్వీపాంతరములతో వ్యాపారము నరు జరుపుచుండెడి వారు.

శ్రీనాథుని బాలసఖుఁ డగునవచితిప్పయ క్రీ. శ. 1390 నుండి 1404 దాఁక రాజ్యమేలిన కొమరగిరి

దోల్లఁ గర్పూరపాదపములు గలవు గాన, యిక్కడ 'పన్నీరుమొలక' యని యుండదగు ననుకొంటిని. శ్రీనాథునినాఁటికిఁ గొంచెముపూర్వమునుండి మాత్రమే మనదేశమునకుఁ బన్నీరు వచ్చుట యేర్పడెను. పన్నీటికేఁ గాని, గులాబిచెట్టునకుఁ గాని సంస్కృతమునఁ బేరు లేదు. అది మనదేశపుఁ బూలల్లో గావు, శ్రీనాథుని కాలమునకు పూర్వపువాఁడగు నాచనసోమన పన్నీటిని పేర్కొనెను. సంస్కృతంబునఁ బన్నీటికి కల్పబడు 'హిమాంబు' అని పేరు వెలసెను. అది 'పన్నీరు' పదమునకు సంస్కృతీకరణము. అది సంస్కృత భాషాపదము గాదు. శ్రీనాథుని తెల్గు భాషాపదమునఁ బన్నీరని, గోజంగిసి యని దాని శైలి(గింపు) గలదు మనదేశమునకుఁ గాలుతఁ బన్నీరును ఆవలఁ గొన్నాళ్లకు దాని చెట్టును వచ్చినదఁట! ఆ చెట్టునకుఁ బారసీకమున 'గుల్' అని పేరు. దాని నీటికి 'గుల్ + ఆబ్ (నీరు)' అని పేరఁట పన్నీటి నిచ్చు చెట్టు గాన అదే గులాబి చెట్టయినది. తెలుఁగున నా చెట్టునకు గోజంగి అనిపేరు ఈ పేరు హిమాలయప్రాంతారణ్యక వ్యవహారమునఁ గలదఁట. పన్నీరు గాని పట్టిగులాబిచెట్లు హిమాలయప్రాంతమునఁ బూర్వమునుండియే యుండెనఁట అవి దక్షిణదేశములకు వ్యాపించి యూరోపులోనే వ్యవహారమునఁ బడెనఁట. పన్నీరు తీయుచెట్లు 'రోజ్' రంగు గల వట్టి. అవి పారసీకమునుండి వచ్చినవే యఁట. రెడ్డి రాజ్యమునాఁట్లలో నా చెట్లను నవచి తెప్పించుకొనెను

వారు మనదేశమునకుఁ గొని తెచ్చి యుండవచ్చును. పన్నీరు ద్వీపాంతరములనుండి తెప్పియు తెమ్మనువాడు లను శ్రీనాథుఁడే చెప్పినాఁడు తెలుఁగుఁ ముఖ్యుఁడవును 'గొజ్జఁగినీరు' 'పజ్జకు' (గోజాంగు) గొజ్జంగి నీరు' సమానార్థకములు. నేను పేర్లు తెలిపినవిగాని, శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఆస్ట్రేలియాది దేశములందు 'బంగారు మొలకలు' (మొలకలు = పలుకులు ఈ యర్థమున నవి వారి దేశములందు వ్యవహారము గలదు.) [illegible] ప్రసిద్ధమయి యున్నదనిరి. మొలక బంగారు అను పదమునకు శబ్దార్థాకరమున 'పుట్టలలో పురుగులవల్లఁ గలిగిన బంగారు' అని యర్థము కలదు. గోవా—పశ్చిమసముద్రతీరమున గోవాపట్టణమే కావచ్చును. యూరపు — యూరోప్ఖండము, జాస్కా. ఇక్కడినుండి ముత్యాలఁ దెచ్చెను. ఇవి ముత్యాలకుఁ బ్రసిద్ధము. భోట — భూటాన్ — ఇది కస్తూరికిఁ బ్రసిద్ధి కెక్కినది. చీని—చీనాదేశము-పట్టుబట్టలకుఁ బ్రసిద్ధము.' ఇక్కడనుండి చీనాంబరములఁ దెచ్చెను. తరుణాసరి — తర్నాసరి1 (Tarnassari), ఇదియు మలయద్వీపకల్పమున నొక రాష్ట్రప్రధాననగరము. తరుణాసరి మన తెలుఁగున నిటీవల 'దనాసరి' అయ్యెన దనుకొందును. 'దనాసరికము', 'దనాసరి గోంగూర' అని వ్యవహారముగలదు. గోంగూర భేదము తరుణాసరినుండి తొలుత వచ్చియుండవచ్చును.

1. దీనిని శ్రీ మ. సోమశేఖరశర్మగారు గుర్తించిరి.

మ. మొదలం దేవర యీసతిచ్చితిర, యే
మ్మఱ జిత్తవృత్తిఁ మదా
మది, నాకుం గొడు కింకనుం గలఁడు, వాఁ
డాడంగ నెం దేఁగెనో,
చనువం బోయెనొ, పిల్వఁ బంచెద నవ
శ్యంబుం, బ్రతీక్షించునీ
యదనం గూరలు చల్లనాఱవె మహా
త్మా! యోగిచూడామణీ ?—

అనెను. సోమనాథునికృతిలో వృద్ధశివయోగి నరమాంస
మడుగఁగా—

'సర్వజ్ఞ! మీ మనోజ్ఞం బైనయట్టి
సర్వలక్షణగుణసంపూర్ణుఁ డొక్క-
వరపుత్త్రుఁడున్నాఁడు నరమాంస మింటఁ
బొరుగింటికిని బిల్వఁ బోయెద నయ్య!
యరుదైనమీవ్రతోద్యాపన సేఁడు
గర మర్థిఁ జెల్లింతు క్షణము గొమ్మనిన

పిదప నారగించునపుడు—

'అతిథిపూజలు సేయు నవసరంబునను
సుతులను దార నుత్సుక లీలతోడఁ
బొత్తునఁ గుడుతు రట్లుత్తమపురుష'—ఱు
—'కాన పుత్త్రుఁడు గలఁడేని పిల్పింపు
లేనినాఁ డొల్లము పాన లొండేల ?'—

అనెను. చిఱుతొండఁడు—

చకితదేహుఁ డగుచుఁ జయ్యన మ్రొక్కి
'యకలంక! మీ రప్పు డన్నారు నేను

విన్నాఁడఁ బుత్త్రుఁడు నున్నాఁడు చదువు
చున్నాఁడొ యాడుచు నున్నాఁడొ పిదపఁ
దనుదెంచి మఱి మీప్రసాదంబు వాఁడు
గొనియెడిఁ గాక భోజన మాచరించి
రక్షింపవే యోగిరములు శాకములు
నక్షయాత్మక ! చల్లనారక యుండ—

అనెను. శ్రీనాథుని రచనమున వృద్ధశైవయోగి యిట్లుఁ జెప్పినదాని

'వానిఁ దల్లియుఁ దండ్రియుఁ వఱుగు సేసి
పాక మొనరించి పెట్టింప భవున కొసఁగి
కుడుతు నాబంతి నిలుఱేఁడుఁ గొడుకుఁ గుడువ"

అనుచో రెండువిధముల వాక్యాన్వయములతో నర్థభేదము లున్నవి. ఇంటియజమానుఁడు గూడఁ గొడుకును (అనఁగాఁ గొడుకుమాంసమును) నాబంతి నారగింపవలె నని యొక విధము. ఈ విధమున 'ఇలుఱేఁడున్' అను నది సముచ్చయార్థకవిశిష్ట మయిన ప్రథమాంత పదము. కొడుకున్ అనునది ద్వితీయాంతపదము. కొడుకుమాంసము వాడి యారగింపఁ బెట్టుచో నా బంతి నా యింటియజమానుఁడు వాని పుత్త్రుఁడును నారగింపవలయు నని రెండవవిధము. ఈ విధమున ఱేఁడున్, కొడుకున్ అనుపదములు రెండును సముచ్చయార్థకోపేతము లయిన ప్రథమాంతములు. శ్రీనాథుఁ డీ యర్థద్వైవిధ్యమును జతురముగాఁ బొసఁగించినాఁడు.

తసమాక్రాంతకృతాంతరూపపవమా
నప్రేంఖనప్రక్రియా
వసరోదంచిత సారసౌరభరస
వ్యాలోలరోలంబముల్.

శృంగారశాకుంతలము. ఆ. 3.

మఱియు ద్వితీయాశ్వాసపద్యము నొకదాని జక్కన విక్రమార్క చరిత్రమున ననుకరించెను.

ఉ. యానిఁగ లావఁజొచ్చె దివి
ధూళి భ్రమింపఁగఁ జొచ్చెఁ బిచ్చుకల్
మానక యుప్పు గబ్బులుఁగు
మాటికి మాటికిఁ గ్రోల్చెఁ గొమ్మపై
వాన యవశ్య మింక బహు
వాసరముల్ జడి పట్టు నం చొగిన్
వానికి వాని కాఁడిరి య
వారణఁ బొటలు గంబిలోపలన్.

—హరవిలాసము

ఉ. యానిఁగ లాడెఁ దోయనిధిఁ
దోరపుమ్రోఁత యొనించె జంతులై
కానఁబడెన్ బలాకములు
కప్పయెలుంగు చెలంగె నిర్జల
స్థానములందుఁ గుంభములు
దన్ గృకలాసము నిల్చి నింగిపై
నానన మెత్తె భూమిరజ
మంగమునం బెరయించెఁ బిచ్చుకల్.

—విక్రమార్కచరిత్ర

కళ్యాణమును, కాళిదాసుని కుమారసంభవమహాకావ్యమున కించుమించుగాఁ దెలుఁగుఁజేఁత యనఁ దగినట్లు శ్రీనాథుఁడు రచించినాఁడు. కాని కాళిదాసు కుమారసంభవములోని కథాక్రమ మిందుఁ గొంత మార్పు నెందినది. శ్రీనాథుని గ్రంథము లెల్లఁ బ్రాయికముగా నాంధ్రీకరణములే యైనను, నా యాంధ్రీకరణము సంస్కృతపు హద్దుపద్దులలో నుండక శ్రీనాథుని యిచ్చకు వచ్చినట్లు విచ్చలవిడిగా నుండును. కొలఁది పట్టులందు మూలాతిశాయిసౌభాగ్య మున్నను రసోత్తరమైన కాళిదాసుని కుమారసంభవమును దెలిఁగించుటలోఁ గూడ జాగ్రత్త వహింపక విశృంఖలముగా వర్తించుట కొన్నిచోట్ల వైరస్యకారణమును నైనది. ఐనను కాళిదాసకృతి నెఱుంగక స్వతంత్రముగా శ్రీనాథరచనమునే చూచువారి కది శయ్యా సౌభాగ్య సౌశబ్ద్యాదిగుణవిశేషములచేఁ గొంతఁత తోఁపనీయనంత హృద్యతతోనే యున్నది. సంస్కృతమూలము ననుసరించి యందలి విషయమును గొంత విడిచియుఁ, గొంత గ్రహించి సంగ్రహించియుఁ, గొంత పెంచియు విశృంఖలముగాఁ జేసిన తెలుఁగుచేఁతలు కొన్ని—

అథ నలలితయోషిద్భ్రూలతాచారుశృంగం
రతివలయపదాంకే చాప మాసజ్య కంఠే
సహచరమధుహస్తన్యస్త చూతాంకురాస్త్రః
శతమఖ ముపతస్థే ప్రాంజలిః పుష్పధన్వా.

కుమార. స. 2. శ్లో. 64.

సీ. కాంతాజనంబుల కటివంక బొమలతోఁ
ప్రతివచ్చు పుష్పచాపంబుతోడఁ
గోకిలవ్రాతంబుఁ గ్రుక్కిళ్లు మ్రింగించు
క్రొమ్మావిచిగురాకుగొడుగుతోడ
రతిదేవి నిటలోగ గ్రాలుచున్నులవాలుఁ
దలఁపించుమీనకేతనముతోడ
భుజగలీలావతీ భుక్తశేషము లైన
గంధవాహకిశోరకములతోడఁ
జంపదునితో వసంతమాసంబుతోడ
రాజకీరరథం బెక్కి ప్రాభవమున
వచ్చె వలరాజు చిత్తానువర్తనముగ
సంభ్రమముతో మహేంద్రునాస్థానమునకు.

హర. ఆ. 3. ప. 38.

గతివలయోత్యాది సంస్కృతశ్లోకభాగము మూలమైనది. పద్యము బాగుగాఁ బెరిఁగినది. హృద్యత కొఱవడినది. సంస్కృతమునఁ దోఁచు కామవినీతత తెలుఁగునఁ గానరామి కొఱంతయే కదా.

దదౌ రసాత్పంకజరేణుగంధి
గజాయ గండూషజలం కరేణుః
అర్ధోపభుక్తేన బిసేన జాయాం
సంభావయామాస రథాంగ నామా.

కుమార. స. 3, శ్లో. 37

ఉ. పంకజరేణుగంధి యగు
పల్వలవారిఁ గరేణు విచ్చెని

శృంగ మహావశంబునఁ బ్రఁ,
జాఁచి గజంబును బమ్మినీమృణా
లాంకుర మర్ధభుక్తము ని
జాంగనకుం బ్రియ మార నిచ్చె నా
వంకఁ జకోరధనుర్ హ్యాపియు
వల్లిలతన్ బ్రియు నంటి చూడఁగన్.

హర. ఆ, 3, ప. 61.

ఇందుశ్లోకమునఁ గల గండూషజలము పద్యమునఁ బల్వలవారి యగుట హృద్యముకాదు. శ్లోకోత్తరార్ధమున గిధాగము తెలుగుపద్యమున గజముగా మాఱినది. ఈ మార్పు నేర్పుగలదే.

సుగంధినిశ్వాసవివృద్ధతృష్ణం
బింబాధరాసన్న చరం ద్విరేఫమ్
ప్రతిక్షణం సంభ్రమలోలదృష్టి
ర్లీలారవిందేన నివారయంతీ.

కుమార. స. 3, శ్లో. 56

ఉ. తమ్మినియూర్పు గాడుపుల
గండముఁ గ్రోలఁగ వచ్చి యోష్ఠకం
బమ్మసమీపదేశమునఁ
బాయక యాడెడు తేఁటిఁ గేళిఁ
దమ్మున మాటిమాటికి స
మంచితవిభ్రమలోలదృష్టియై
యమ్మదిరాక్షి చోఁపె దర
హాసవికస్వరగంధపాళికై.

హర. ఆ. 3. ప. 71.

సహకారమంజరీచరుపింఛకబళంబు
పెట్టుండు మాకు నై పికము మట్టఁ
దేనె వెట్టుంపు కస్తూరిఁ దీర్చి యచటఁ
జేర గొజ్జంగ పూనీటఁ జెంబు లిడుఁడు
నన్ను వలరాజుఁ దలఁచి మన్నన దలిర్పఁ
దగ సమర్చన సేయుఁడు దంపతులను.

హర. ఆ. 3. ప. 49.

ఈ తెలుఁగు సీసపద్యము మూలమును గొంత విడిచినను హెచ్చుగాఁ గొంత సంతరించుకొని ముచ్చట గొల్పుచున్నది. తస్మిన్ తేనె ధర్మోపకర మిడుట, పికములు ముట్టునట్లు సహకారమంజరులు పిండములుగ పెట్టుట, గొజ్జంగిపూనీటి యుదకుంభము లిడుట మూలాతిశాయి సౌందర్య సంపాదకములు.

భవ త్యనిష్టాదపి నామ దుస్సహాత్
మనస్వినీనాం ప్రతిపత్తి రీదృశీ
విచారమార్గప్రహితేన చేతసా
న దృశ్యతే తచ్చ కృశోదరి ! త్వయి.

కుమార. స. 5, శ్లో. 42.

సీ. ప్రథమ ప్రజానాథ..........

గీ. దుష్కరంబైన తప మిట్లు దొడఁగి సేసి
మేను డయ్యించుకొనఁగ నేమిటికి వచ్చెఁ
జిత్తము విచారమార్గంబుఁ జేరఁ దెచ్చి
తత్త్వముఁ దెలియఁజెప్పు చూతము మృగాక్షి !

హర. ఆ. 4. ప. 23.

శ్రీనాథుఁ డాంధ్రపద్యము ననద్దంగా నాశుకవితగా రచించియున్నాడు. మఱియు,

కియచ్చిరం శ్రామ్యసి గౌరి! విద్యతే
మమాపి పూర్వాశ్రమసంచితం తపః
తదర్ధభాగేన లభస్వ కాంక్షితం
వరం త మిచ్ఛామి చ సాధు వేదితుమ్.

కుమార. స. 5, శ్లో 50.

ఉ. ఏనును బ్రహ్మచారిఁ, బర
మేష్ఠి! నీవును గన్య. వింతకా
లానను నీకుఁ బెండ్లియగు ఫ
లం బగు నేని విచార మేల? స
న్మానముతోడ నన్ను ముని
మాన్య వివాహము గమ్ము లెమ్ము, కా
దేనిఁ దపంబులోని సగ
మిచ్చెద మాను తపోభిమానమున్.

హర. ఆ. 4, ప. 25.

పై శ్లోకమునకు శ్రీనాథుని తెలుఁగుపద్యము సరియయినదికాదు.

'కన్యే కామయమానం మాం
న త్వం కామయసే కథమ్
ఇతి గ్రామ్యోఽయ మర్థాత్మా
వైరస్యా యైవ కల్పతే'

అను దండిసూక్తికి లక్ష్యమై యున్నది.

'ఎంతదాఁక శ్రమింతువు? బ్రహ్మచర్యాశ్రిత మగునాతపసున సగ పాలిత్తును. దాన నీకాంక్షిత వరలాభమును బడయుము. నీ వరాపేక్ష యేదో యదియు నేఁ దెలియఁ గోరుచున్నాను.' అని యర్థము గల శ్లోకమునకు సరిపడని తీరున నీకుఁ బెండ్లియే కావలసి నదియేని మునిమాన్యుని నన్నుఁ బెండ్లాడుము. లేక, తపస్సే కావలసినదియేని నా తపస్సులోన సగపాలిత్తును. కైకొని తపోభిమానము వీడుము' అన్న తెలిఁగింపు రోఁతగా నున్నది. ఇట్టి వటునిమాట విని పార్వతి యట నుండి లేచి పోవలసినదే! వటుఁడు శివుఁడే కనుక, పార్వతికిఁ దనపై నేకాంతానురాగముకల్మిని గుర్తింప నట్లు పలికె నని సరిపుచ్చుకొందమన్నను వటుం డిట్లన్న మీఁదటఁ బార్వతి రోఁత చెందినట్లు చెప్పకుండుట యసంగత మగును.

నన్నయభట్టారక పద్యానుకరణోత్సాహమున శ్రీనాథుఁడు కాళిదాసశ్లోక రసభావౌచిత్యానుశీలనమును మఱచినాఁడు.

శ్రీనాథుని ప్రస్తుతపద్య మీ క్రింది నన్నయ భట్టారకపద్యమున కనుకరణము—

ఉ. నీవును బ్రహ్మచారివి వి
నీతుఁడ వేనును గన్యకన్ మహీ
దేవకులావతంస ! రవి
తేజ ! వివాహము నీకు నాకు మున్

భావజశక్తి నైనయది
పన్నుగ నన్నుఁ బరిగ్రహింపు సం
జీవనితోడ శుక్రుదయిఁ
జేయుము నాకుఁ బ్రియంబు నావుడున్.

ఆది. ప. ఆశ్వా. 3.

శ్రీనాథుఁ డీ తృతీయ చతుర్థాశ్వాసముల రెంటిని రెండునాళ్లలో వడివడిగా రచించినట్లున్నాఁడు. రసోత్తరములయిన మూలశ్లోకములఁ బెక్కింటిని దేలికపాటు పదసంచనలోఁ బొందించినాఁడు.

ఈ కథను శ్రీనాథునికిఁ బూర్వము నన్నిచోడ మహాకవికూడఁ గుమారసంభవ ప్రబంధగర్భమునఁ గూర్చినాఁడు. అతఁడును గాళిదాసకుమారసంభవశ్లోకములఁ గొన్నింటి నందుఁ దెలిఁచినాఁడు. కాని యది చాలఁగా స్వతంత్రరచనమే. శ్రీనాథుని రచనకుఁ గల శయ్యాసొంపు, ప్రసాదము దానఁ గానరాదు గాని దానికున్న దేసిరచన, జానుఁదెనుఁగు పొలుపు, భావగాంభీర్యము, అర్థపుష్టి శ్రీనాథుని రచనకు లేదు. కాళిదాసకథాకల్పనానుసారి యగు శ్రీనాథకథాసంగ్రహము నన్నిచోడకథాకల్పనమునకంటెఁ జతురత గలదై యున్నది. అర్వాచీనాంధ్రకవి యగు కోటిరఘునాథ భూపాలుఁడు నొక కుమారసంభవ ప్రబంధమును రచించినాఁడు. అది కథాసౌందర్యము, కల్పనాచమత్కారము, నేఁటి తేట

తెలుఁగు కూర్పుసొంపు గలదై చాలఁ జక్కఁగా మున్నది.

### దారువనవిహారము

సంస్కృతమున నుత్ప్రేక్షావల్లభుఁ డనుకవి యీ దారువనవిహారమును 'భిక్షాటనకావ్య' మను పేర సవిలాసముగ వర్ణించెను. అది శృంగారరసపూరిత మగునుచ్ఛృంఖలకావ్యము. ఆ కావ్యమునకును శ్రీనాథుని యీ రచనకును సంబంధములేదు. పరమశివలీల యగు నీ కథాఘట్టమున నౌచిత్యచర్చ జరుపుట సంగతము గాదు. ఐనను శ్రీనాథుఁ డీ కథారచనలో నౌచితి నంతగాఁ గోల్పోకుండుట ముదావహము.

'ఎంచి నుతింప శక్యమె యహీశ్వరు నంతటివాని కైన' ఇత్యాదిక మగుహరవిలాస పంచమాశ్వాస పద్యము పిల్లలమఱ్ఱి పినవీరన శృంగార శాకుంతలమునఁ గూడఁ గానవచ్చుచున్నది. నిజముగా దాని రచయిత యెవ్వరో యీ యిద్దఱిలో ?

### సముద్రమథనము, హాలాహలభక్షణము

శ్రీనాథుఁ డీ కథను భీమఖండరచనానంతరమే రచించినట్లు గుర్తింపనగును. సముద్రమథనారంభమున దేవాసురులు విఘ్నేశ్వరపూజ సేయుట సంస్కృతభీమ ఖండమునఁ గలదు; తెలుఁగుభీమఖండమునను గలదు. ఈ సందర్భము భాగవతాదిపురాణములలోనిది గాదు. హరవిలాసమునఁ గూడ నీ విఘ్నేశ్వరపూజాప్రకరణ

మున్నది దీని యునికి భీమఖండ కథాసందర్భానుకరణమే యనుకొందును. మఱియు సంస్కృతభీమఖండశ్లోకపుఁ దెనుఁగుసేఁత కందపద్యము భీమఖండమునం దున్నది. ఆ పద్యమే యీ హరవిలాసమునను నున్నది. ఇందు హాలాహలభక్షణము, సముద్రమథనము నడిమి గల కథా గతిత్రో నున్నవి.

కిరాతార్జునీయము

భారవి రచించిన కిరాతార్జునీయకావ్యపుఁగథయే యిది. కాని నా చూచినంతలో నా కావ్యమునకు దీనికి సంబంధము కానరాలేదు. భారతారణ్యపర్వమునఁ గల కథాసంక్షేపమున కిది విస్తృతి. శ్రీనాథుని కవితాశయ్య యీ యాశ్వాసమున మిక్కిలి సిగసిగలు దేరి యున్నది. ఈ యాశ్వాస మొక్క స్వతంత్రసత్కృతి యనఁదగినది. ఇంద్రుఁగూర్చి యర్జునుఁ తపశ్చర్య, వృద్ధబ్రాహ్మణవేష మునఁ జేరవచ్చి యింద్రుఁ డర్జునునితో సంభాషించుట, శివునిఁగూర్చి తపస్సు చేయు మని బోధించుట, శివునిఁ గూర్చి యర్జునునితపస్సు, శివకిరాతవేషము, వరాహ హననము, అర్జునకిరాతవివాదము, పరస్పరయుద్ధము, ఈశ్వరసాక్షాత్కారము, పాశుపత వర ప్రదానము, అర్జునస్వర్గయాత్ర, ఊర్వశీదర్శనము, అర్జునోర్వశీభాష ణము, అర్జున నిర్మలశీలసౌభాగ్యము, ఊర్వశి యవ మానపాటు, శాపప్రదానము, అరుణోదయాదివర్ణ నము, నివాతకవచాదులవిజయము, ఇంద్రసత్కారము

నను విషయవిభాగములు గలదై యీ యాశ్వాస మీా గ్రంథములోని యన్ని యాశ్వాసములకంటె గొప్పదై యొప్పు మీాఱి యున్నది. ఇందు అర్జునోర్వశీ సంవాద మాచితీరుచిరమై మనోహరముగా నున్నది. శ్రీనాథుని గ్రంథములనుండి కండపట్టఁదగిన కథఘట్టములను దెలిఁగింపు గానిదానిఁ బేరుకొనఁ గోరుకొందుమేని యీా కిరాతార్జునీయమే యందుకుఁ దగినది.

హరవిలాసము శ్రీనాథుని తక్కిన గ్రంథములన్నిటి కంటె మృదుమధురరచనము గలది. బహుళప్రౌఢ సంస్కృతపదఘటనలు, అన్వయక్లేశములు కారక ప్రయోగ వైచిత్ర్యములు–భాషాంతరీకరణము లగుటచే శ్రీనాథుని యితరగ్రంథములలో సధికములైయున్నవి. ఇం దంత గానరావు. శ్రీనాథుని రచనల లోఁతుపాఁతుల సక్రమముగాఁ నెఱుఁగఁ గోరువారు హరవిలాసోప క్రమముగాఁ దద్గ్రంథములను జదువఁ దగుదురు. నన్నయ తిక్కన నాచనసోమనల తెలుఁగురచనల పోలికలు, మురారి నాటకశ్లోకానుకృతులును నీ హర విలాసమునఁ గొన్ని కానవగును. విస్తరభీతిచే వాని నిందుఁ జూపకుంటిని. అపూర్వశబ్దములు, ప్రయోగ విశేషములు, లక్షణవిశేషములు నిందుఁ గొన్ని గాన వచ్చుచున్నవి. సవిశేషము లని పరికింపఁదగినపద్యాంశ ములఁ గొన్నిటి మాత్ర మిందుఁ జూపుచున్నాను. పెడము వెట్టి, చింకల్, వాడెపట్టులు విఱిచి, బారాది

దివ్యించి, భోగిని కుర్యముండు, అంపాజాలంబు గుఱిసి, అనంచిమే కంచి నీకు, ఎంప్రాసఁగుటమ్ములు, మిన్నక మిరెండుకుమారకుఁడు, చిఱుబంతిపస్పుతోఁ జెపపు నలఁది, సీకాయయుప్పున జిడ్డుఁబాపి, కెంవాఁడిగా నూటికి గంటి దిద్దె, గోజఁగనీటఁ జేపట్టు గావించి, చిత్త స్మృత్తికా నుఱూకు, ఒత్తిజల్ చీకి, వానె నైశ్యులఁ బిళ్ల యర్వ్యలను గూడి—ఇట దైతేయుఁడు...కత్తెగము జోడఁ బుండరీకంబుతోలు, మసృణాస్నిగ్ధతరత్వచర్మ ముయు, నైయూఘ్రూజినఖండమధ్యమున, ఏటలవి నేసి...గాజులుకునఁ గొఱంతిడి, అబసరపుంబెఱంగున- ఇత్యాదులు.

కూచిమంచి తిమ్మకవి లక్షణసారసంగ్రహమున హరవిలాసపద్యములఁ బెక్కింటి నుదాహరించినాఁడు. ఆయుదాహరణములఁ దత్పద్యపాఠముల గుర్తించితిని. మిన్నక మిరెండు, అబసరపుంబెఱంగున ఇత్యాదిపాఠములు వ్రాఁతప్రతులలో నున్నట్లు తిమ్మకవి యుదాహరణము వలను గలవు. ఇట్టిపట్టులఁ బూర్వపూర్వోత్తర ముద్రణ పాఠములు గొన్ని సరియైనవిగావు. శక్య మయినంత వజు కవి చెక్కఁబలుకులఁబడిసినవి. పూర్వ పూర్వోత్తర ముద్రణములందు 'కమ్మయూనె' యనునట్టి నలుగుతో జలకమార్చి యొసంగిరి గౌతమసత్త్రములే'-(ద్వితీయాశ్వాసము) అని కలదు 'ఒసగు' సానుస్వార మనుట కాదిక ప్రయోగములు మృగ్యములు. శాసనములలో

ఎసఁగు, ఒసఁగులు నిరనుస్వారములుగా నున్నవి అవి తిక్కనభారతమున నిరనుస్వారములుగాఁ బ్రాసస్థలముల నున్నవి. శ్రీనాథుని గ్రంథములలోనే గుర్తించి సంతోషపడి యొక్కటే 'యొసంగిరి' అని పూర్ణానుస్వారవిశిష్టముగాఁ గానవచ్చును దీనిఁగూర్చి భారతి సంపు 12, సంచిక 12, పు 881—4 చూడఁదగును. హరివిలాసపు వ్రాఁతప్రతులఁ బరిశీలింతుముగదా—యందు 'జలక మార్చిరి యిచ్చిరి ధౌతవస్త్రముల్' అన్నపాఠమున్నది 'ఒసంగిరి' అన్న పూర్వ పూర్వోత్తర ముద్రణపాఠము గానరాదు. ఆముక్త మనుచరిత్రాద్యర్వాచీన గ్రంథములందు 'ఒసంగు' సానుస్వారముగా నున్నది.

అధ్వాన్నపుం బట్టునన్ (74 పుట)—'అధ్వాన్నము శత్రుమధ్యము' అని నానుడి కలదు. దానిననుసరించి పై యట్లు ముద్రిత మయ్యెను. 'అధ్వానము' అనియే వ్రాఁతప్రతి. 'అధ్వ' శబ్దము తత్సమరూపము 'అధ్వానము' కాఁబోలును. శ్వ, శ్వాన శబ్దములు సంస్కృతముననే యున్నవి అట్లు అధ్వ, అధ్వానశబ్దములు నున్నవేమో! శబ్దరత్నాకరకారులు అధ్వానము=అమార్గము అని యర్థముతో అకారాంత సంస్కృతపదముగా గ్రహించిరి. కర్ణాటమునఁ బంపకవి విక్రమార్జున విజయములో 'అధ్వానపదపరిశ్రమశ్రాంతి' యని ప్రయోగ మున్నది. తన్మూలరూపకు

లాయధ్వాసపదమును మార్గార్థకముగా గ్రహించిరి. మార్గమని, అపమార్గ మనియేని యర్థము గలసంస్కృత శబ్దమని, అధ్వశబ్దమునం దత్సమరూప మనియేని గ్రహించినను, శ్రీనాథుని 'మధ్వాసన్నం బట్టు' సమర్థిత మగును. ప్రాంతప్రతి పాఠము పరిగ్రాహ్యమే కావచ్చును. కాని తెల్గున నింక నెక్కడను నీ 'యధ్వాసము' నాకుఁ గానరాలేదు. వాచస్పత్యమున 'అధ్వాంత శాత్రవః=సూర్యసీమారిపుః' అని యున్నది దానిఁబట్టి 'అధ్వాంత' మని యుండిన బాగనిపించును.

శా. మౌళిం గోహళి సంఘటించినక్రియన్
మధ్యాహ్న వేళన్....
ప్రాలేయాహితసంప్రదీప్తకిరణ
ప్రక్రీడ దర్కోపల
జ్వాలాజాలజటాలజాంగలతటీ
వాచాలకోయష్టియై

హర. ఆ. 7. ప 109.

పయిపద్యమున 'కోహళి' కర్థమెఱుఁగరాదు. 'ఆలపట్టము' కాని, 'ఉల్లడ' కాని కాఁదగు నను కొందును. నాచనసోమన కూడ నీ పదమును ప్రయోగించెను. 'పార్వతీపతికిఁ బ్రభాతభూపతి గొన్నయలరుఁ గొందమ్మి కోహళి యనంగ___భానుబింబంబు కన్నుల పండువయ్యె'___ఉ. హరి. ఆశ్వా. 3. ఇక్కడఁ గూడఁ బై యర్థములే సంగతము లగును. సంస్కృతాంధ్రము

లలో నా కీ పద మింక నెక్కడను గానరాలేదు—పయిపద్యోత్తరార్ధము క్రీడాభిరామమునను గలదు. మురారి నాటకశ్లోకభాగము దీనికి మూలము.

ఏడవయు—'విభూతిమంగళ, స్నానముఁ జేసి ధౌతపరిధానము గట్టి' (ఆ. 2. ప. 37.) ఇక్కడ యతినిగూర్చి పూర్వము 'భారతి'లోఁ గొంత చర్చ జరిగెను.

స్నానపదము 'స్త్నానము' అని యుండవలె ననియు, నది వేదోచ్చారప్రకార మనియు, శ్రీనాథుఁడు వేదజ్ఞుఁడు గాన యట్లు ప్రయోగించెననియు నొకానొకరి వాదము. వేదోచ్చారము వేదమునకే కాని భాషకుఁ గాదు. ప్రశ్నమునకు ప్రశ్ఛ్నము, సంవత్సరమునకు 'సంవత్థ్సరము' అని యిత్యాదివిధముల వేదోచ్చారమున్నది. సంస్కృతభాషలో నట్టియుచ్చారము గాని లిపి గాని కానరాదు. సంస్కృతగ్రంథములందుఁ గాని, శాసనములందుఁ గాని కానరాకున్నను నీ యతిని రక్షించుటకై యిక్కడ 'స్నానము' ను 'స్త్నానము'నుగాఁ జేయ నక్కఱలేదు. తెలుఁగునఁ దద్భవవ్యాజయతి యని యొక యతి భేదము గలదు. దానిఁబట్టియే ప్రాచీన కవీశ్వరులు 'జ్ఞ' కు 'న' తోను 'కవర్గము'తోను యతిఁ గూర్చిరి. విజ్ఞానము–విన్నాణము, సంజ్ఞ–సన్న, ప్రజ్ఞ–పగ్గె, సంజ్ఞ–సైఁగ అగుటనుబట్టి 'జ్ఞ' కు న, కవర్గములతో యతి చెల్లినది. అంతేకాని విజ్ఞానాదిపదములలో

'జ్ఞకారము' న 'నకారము' గాని కవర్గాక్షర మేది గాని కలదన రాదు. అట్లే స్నానపదము గూడఁ దద్భవ మయినపుడు తానన మగును. సంజ్ఞాది శబ్దములువోలె సంస్కృతసమాసగతముగా నున్నను స్నానశబ్దము దద్భవవ్యాజమునఁ దవర్గముతో యతిమైత్రిం జెందెను.

మఱియు నీ హరవిలాసమున 'ప్రారంభం బొకయింత లేకను తృణప్రాయంబు సల్లు' అనుచో 'లేకను' అని ప్రయోగమున్నది. ఇది నన్నయ భట్టారకుని 'లేకను సంతానోచ్ఛేద' ప్రయోగముం బోలినది. అక్కడఁ జెప్పఁదగ్గసమర్థనో పత్తులే యిక్కడను జెప్పఁదగినవి.

ఈ హరవిలాసము పీఠికాభాగము కొఱంతగా గ్రంథ మెల్ల నొక్క తాటియాకుప్రతి తంజావూరు లైబ్రరీలోఁ గలదు. పీఠికాభాగ ముండి సప్తమాశ్వాసము లేక ప్రాచ్యలిఖితశాలలో వేఱొకప్రతి గలదు. ఈ రెండు ప్రతుల తోడ్పాటుననే పూర్వము కాకినాడ సరస్వతీ పత్రికాధిపతు లీ హరవిలాసమును ముద్రించిరి. నాఁటికి నేఁటికి నీ రెండువ్రాఁతప్రతులే కాని క్రొత్త దేదియుఁ గానరాలేదు.



# ౧

# మనుచరిత్రము

ఉ. తల్లి సమస్తభాషలకు దైవతభాషయు, దేశభాషలన్
పిల్లలలోన నాంధ్రి యను పేరిటి దెంతయు ముద్దులాఁడి రా
ట్తల్లజు లాదరించినకతంబునఁ బల్కులఁ గుల్కు మీఁది యు
ల్లల్లనఁ దక్కు నక్కు నెలయింద్రపు నెక్కుడుకీర్తి చేకొనెన్.

క. జిలిబిలిపలుకుల పలుకుము
ద్దులు గులికెడు తెలుఁగుదానతో సరియగునే
తెలిసియుఁ దెలియక వీనుల
నలయించెదు వెట్టిమొట్టి యఱవముబదాసల్.

సంస్కృతమని పేర్కొనఁబడిన యార్యభాషయే తొలుదొలుత భరతఖండమునఁ బెంపొందిన వాఙ్మయము. చాలనాళ్ళకు దానివలననే తర్వాతఁ బ్రాకృతములును దేశభాషలును బెంపొందినవి. దక్షిణహిందూదేశమునఁ గల దేశభాషలలో నాంధ్ర ద్రవిడ కర్ణాట భాషలు ప్రధానమైనవి. ఇందు ద్రవిడ కర్ణాటభాషలాంధ్రమునకంటెఁ బ్రాచీనములని యూహింపఁ బడుచున్నవి. ఆ రెండుభాషలలోను గ్రంథములు రచింపఁబడుచు వచ్చినకొంతకాలమునకుఁగాని యాంధ్రభాషలో గ్రంథరచన ముపక్రమింపఁబడినట్లు చూపట్టదు. గ్రంథరచన ముపక్రమింపఁబడుటకుఁ బూర్వ మాంధ్రభాష

స్థితి యెట్టిదో యించుకయుఁ దెలియరాదు. ఇటీవల నాంధ్రకవితకుఁ బుట్టిల్లనఁ జెల్లిన వేంగీదేశమునం దానాఁడు జన్మించిన నాగవర్మ కర్ణాటభాషకు ఛందోంబుధి యను ఛందశ్శాస్త్ర గ్రంథమును రచించె; కాని యాంధ్రభాష యుబుసైన నెత్తఁదయ్యె. నాఁటి కీభాషకుఁ దిన్ననిరూపేర్పడలేదు గావలయు. ఆకాలమున మనదేశమును జాళుక్యులు పాలించుచుండిరి. ఆర్యధర్మము సర్వత్రికముగా పాటింపఁబడుచుండెను. జనులకుఁ బురాణాదిజిజ్ఞాసయుం దాదరము మెండుకొని యుండెను. వారు సంస్కృతభాషాగ్రథితములైన తత్తద్గ్రంథములను 'గాసటబీసటే' చదివి గథలు ప్రవ్వచుండిరి. రాను రాను దేశభాషకును గొంత రూపేర్పడుచుండఁబోలు. అక్కాలమున నట్టి దేశభాషాకవన మావశ్యకమయ్యెను. అయినను దానికిఁ దగిన సామాగ్రిని గూర్చి కవితను వెలయించువా రవతరింపవలసియుండిరి. ఇట్లు సనఁ జన,

క. మును మార్గకవిత లోకం
బున వెలయఁగ దేశికవితఁ బుట్టించి తెనుం
గు నిలిపి రంధ్రవిషయమునఁ
జన సత్యాశ్రయునిఁ దొట్టి చాళుక్యనృపుల్.

నన్నెచోడని కుమార సంభవము.

దాదాపు నేఁటికి వేయి సం॥లకుఁ బూర్వము చాళుక్యాన్వయభూషణమును సత్యాశ్రయాది బిరుదాంచితుఁడును రాజమహేంద్రపు రాజధానిగా వేంగీ

దేశమును బాలించినవాఁడును నగు రాజరాజనరేంద్రుని యాస్థానమునఁ గల సర్వజ్ఞుఁ డగునన్నయభట్టారకుఁ డను పండితకవియే మన యాంధ్రభాషలోఁ దొలుతఁ గవిత నవతరింపఁజేసినవాఁ డని తెలుపఁబడుచున్నాఁడు. రాజరాజనరేంద్రుని ప్రేరణమున నీతఁడు పంచమవేద మగు భారతమును దెనుఁగున రచింపఁ దొడఁగొని యరణ్య పర్వము లోని కొంతభాగమువఱకును నెఱవేర్చెను. ఈతని కవనమున సంస్కృత మర్యాదలు మెండుకొని యుండును. సుడికారము గల తెలుఁగుఁ బలుకుబడులఁ గూర్చుటయం దీతఁడు తక్కువవాఁడు కాఁడు.

చ. బహువనపాదపాబ్ధికులపర్వతపూర్ణసరస్సరస్వతీ
సహితమహామహీభర మజస్రసహస్రఫణాళిఁ దాల్చి దు
స్సహతరమూర్తికిన్ జలధిశాయికిఁ బాయక శయ్య యైనయ
య్యహిపతిదుష్కృతాంతకుఁ డనంతుఁడు మాకుఁ బ్రసన్నుఁ
డయ్యెడున్.

గీ. పల్లవారు తెలుఁగ నొల్ల రిధర్మపు
బేల ! నీకుఁ జెప్ప ! నేల వలనెఁ
జిఱుతవాని కింత తఱుసంటి పలుకులు
సన్నె వృద్ధజనము లున్నచోట.

పదపడి కవిబ్రహ్మ నాఁబడుతిక్కన విరాటపర్వము మొదలు ౧౫ పర్వములభారతమును దెలుఁగు కావించెను. తెలుఁగుఁ బలుకుబళ్లను గుబాళింపఁజేయుటయం దీతని కీడు మఱి లేఁడు. ఈతని కవనమున రసపోషకములు కాని పదములు సాధారణముగాఁ జూపట్టవు.

ఉ. చిచ్చఱకన్ను మూసికొని చేత్రిశూలము డాఁచి లీలమై
వచ్చిన రుద్రుచందమున వ్రాలుదు వీవనిలోన నోర్వఁగా
వచ్చునె నిన్ను నెట్టిసుగవారికి నీకృప నాశ్రయింపఁగా
వచ్చిరె మెవ్విధిం గెలువ వచ్చు మహాత్మ! యెఱుంగ జెప్పవే.

తర్వాత నీ యిద్దరకుఁ దుల్యుఁ డనఁదగు వాఁడెఱ్ఱాప్రెగ్గడ. ఈతని కృతులం దారణ్యపర్వశేషపూరణ మొకటి.

చ. స్ఫురదరుణాంశురాగరుచిఁ బొంపిరివోయి నిరస్తనీరదా
వరణములై పవిత్రమలవైభవజృంభణ ముల్లసిల్ల ను
ద్ధురతరహంససారసమధువ్రతనిస్వనము ల్సెలంగఁగాఁ
గరము వెలింగె వాసరముఖంబులు శారదవేళఁ జూడఁగన్.

ఈ మువ్వురను గవిత్రయ మందురు. వీరివాక్కు లాంధ్రభాషకుఁ బరమప్రమాణములు. ఇట్లాంధ్రభారతము ముగియునప్పటికి దాదాపు 300 సం॥ పట్టెను. ఈ నడుమను గొందఱు మేటికవు లితర పురాణాదులను దెలిఁగించుచు వచ్చిరి. ఇట్లు రానురాను గ్రొత్తత్రోవలు త్రొక్క కవనమునకు మార్పులు గలిగించిన వాఁడు కవిసార్వభౌముఁడు నాఁబడు శ్రీనాథుఁడు. ఈతఁడు తొంటివారివలెఁ జాలమట్టునకు సంస్కృత గ్రంథములనే తెలిఁగించినవాఁ డయ్యును గూర్పునందు మార్పు కలిగించి తర్వాతి ప్రబంధరచనకు మార్గ

